చిరతల

# రామాయణభజనకీర్తనలు



గ్రంథకర్త

## శ్రీయుత
## బల్జానస్వామికవి.




కాళహస్తి తమ్మారావు సన్సు
సంస్కృతాంధ్రబుక్కుడిపో, రాజమండ్రి

# మావద్ద దొరకు గ్రంథములు

## కథలు

| | | | |
|---|---|---|---|
| పన్నెండు రాజుల కథలు | 1 | 0 | 0 |
| పదునారు రాజుల కథలు | 1 | 0 | 0 |
| మదన కామరాజు కథలు | 0 | 12 | 0 |
| కాశీమజిలీ కథలు I భాగం | 1 | 12 | 0 |
| డిట్టో II భాగం | 0 | 12 | 0 |
| అరేబియన్ నైట్సు కథలు | 4 | 8 | 0 |
| స్త్రీభక్తవిజయము | 0 | 8 | 0 |
| శుకసప్తతి కథలు | 0 | 8 | 0 |
| పురూరవచక్రవర్తి కథలు | 0 | 8 | 0 |
| అపరూపచంద్రకాంత | 0 | 8 | 0 |
| పంచతంత్రము | 0 | 8 | 0 |
| నలమహారాజు కథలు | 0 | 8 | 0 |
| దమయంతి కథలు | 0 | 8 | 0 |
| కాళిదాసు కథలు | 1 | 4 | 0 |
| వీరేశలింగ చరిత్రము | 1 | 0 | 0 |
| శ్రీనాథుని చరిత్రము | 1 | 0 | 0 |
| శ్రీకృష్ణ భారతము ఆది సభాపర్వములు | 3 | 0 | 0 |
| డిట్టో అరణ్యపర్వము | 3 | 0 | 0 |
| కాశీరామేశ్వరయాత్రాదర్శనము | 0 | 12 | 0 |
| సీతారామ నవల | 1 | 4 | 0 |
| రామాయణసారము వచనకావ్యము ముద్దులాలుర పద్యములు మించిన ప్రతులు దొరకవు. | 1 | 4 | 0 |
| సాత్త్వికబ్రహ్మవిద్యానిరసనము | 1 | 0 | 0 |
| సనత్సుజాతీయము | 0 | 8 | 0 |
| సనారవిశ్వేశ్వరసంవాదము | 1 | 12 | 0 |
| విజయవిలాసము పద్యకావ్యం | 0 | 8 | 0 |
| బిల్హణీయము | 0 | 8 | 0 |
| సానందోపాఖ్యానము | 0 | 8 | 0 |

## నవలలు

| | | | |
|---|---|---|---|
| సౌందర్య తిలక | 1 | 0 | 0 |
| కర్పూరమంజరి | 1 | 0 | 0 |
| హేమలత | 1 | 0 | 0 |
| రాజరత్నము | 0 | 12 | 0 |
| రామచంద్రవిజయము | 0 | 12 | 0 |
| కృష్ణవేణి | 0 | 8 | 0 |
| చమత్కారమంజరి | 0 | 14 | 0 |
| డిటో II పార్టు | 0 | 14 | 0 |
| ప్రహసనమంజరి | 0 | 8 | 0 |
| అహల్యాబాయి | 0 | 8 | 0 |
| సిద్ధార్థి చరిత్రము | 0 | 12 | 0 |
| ఘుఘులచరిత్ర | 0 | 8 | 0 |
| మణిమంజరి | 0 | 8 | 0 |
| సువర్ణగుప్తము | 0 | 6 | 0 |
| మనోరమ I, II పార్టులు | 1 | 0 | 0 |
| శారద | 1 | 2 | 0 |
| శాంతదేవి | 1 | 0 | 0 |
| సతీసోణారాణి | 1 | 0 | 0 |
| లలిత | 1 | 0 | 0 |
| సువర్ణశృంఖల | 0 | 8 | 0 |
| చంద్రవదన | 0 | 8 | 0 |
| పరమానంద చరిత్ర | 0 | 8 | 0 |
| కపాలకుండల | 0 | 12 | 0 |
| పాతాళభైరవి | 2 | 0 | 0 |
| మాయావి | 1 | 12 | 0 |
| మనోరమ | 1 | 12 | 0 |
| మాయావిని | 0 | 12 | 0 |
| మయసభ | 0 | 12 | 0 |
| విమలాదేవి | 1 | 8 | 0 |
| తారాబాయి | 1 | 0 | 0 |
| శివాజి | 0 | 6 | 0 |

వలయువారు:— కాళహస్తి తమ్మారావు సన్సు

ప్రొప్రయిటర్సు సంస్కృతాంధ్రబుక్కుడిపో, రాజమండ్రి

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

చిరతల

# రామాయణ భజన కీర్తనలు

మద్రిపూడి కాపురస్థులు సదా శ్రీ విష్ణుభక్తుండు నగు

## బల్లా స్వామిగారిచే

రచియింపబడి

బుక్కు సెల్లర్సు

కాళహస్తి తమ్మారావు అండు సన్సు వారిచే

ప్రకటింపబడినది

మూడవకూర్పు 2000 ప్రతులు

రాయవరమున

మల్లిడి సత్తిరెడ్డిగారి

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

**1931**

 [ వెల రు 0—6—0

ఓ సత్వజనులారా!

చ॥ ధరవరణ్య మహేంద్రపుర ధాముడు శ్రీశివగోత్రపావనుం
దురుతర కాళహస్తిసుకులోద్భవుడౌ యల వీరయాఖ్య సుం
దర సుకుమారసూనుడు సదా శివభక్తుడు తమ్మరావు సా
దరమున నచ్చువేసి విదితంబుగ నమ్ముదునంచు గోర శ్రీ
నరహరికీర్తనల్ మహాసంతసమొప్ప రచించియిచ్చితిన్॥

గీ॥ ధరను మల్లిపూడి నివాసకుండ
సరసభల్లావారి వంశజుండ
తిరపయాఖ్యుకుగన్న కుమారఘనుడు
నరయ బల్లాస్వామి నామాంకితుండ॥

గీ॥ పదియారేండ్ల ప్రాయంబు గలుగువాడ
గనుకపసివాడ కరుణింపవేడువాడ
బాలకవియని నన్ను మా పూరియందు
జనులుబిలుతురు సద్భక్తజనములారా!

మల్లిపూడి
పెద్దాపురము తాలూకా
తూర్పుగోదావరిజిల్లా

ఇట్లు
బాలకవి బల్లాస్వామి

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

చిరతల

# రామాయణ భజన కీర్తనలు

## విఘ్నేశ్వర ప్రార్థన

అనుగు—కీర్తన మధ్యమావతిరాగము—ఆదితాళము

ఇందురావయ్యా గణనాయక । వందనంబిదుగో నీకు ముందుగా జేతునయ్యా॥ మల్లెమొల్ల సంపెంగపూలతో । విఘ్నేశ్వరమీ పూజలు జేతును॥ ఇందు॥ నిన్నుదలచకుండేపనియైన నిర్విఘ్నగాదు॥ దేవనన్ను రక్షించుముస్వామి। మూషకవాహన మునిజనవందిత దోషరహితుడవు విఘ్నవినాయక॥ యిందు॥ శరణానివేడితినిదేవ । గౌరీనందన వేగ చేపట్టిరక్షించరా । కరిముఖనుతజన కల్మషసంహార కరుణాసాగర కావు గజానన॥ యిందు॥ సకాలవిద్యాల కెల్లనీవు స్వామివనూచు। నేనుసరసితో వేడుకొంటి । భాద్రపదశుద్ధచవితికి నేనుభక్తిమీరమీపూజలు జేతును॥ యిందు॥ భక్ష్యాభోజ్యములనునీవు కుక్షిలోనుంచిన। స్వామినాదాపుజేరి బ్రోవరా। పావనచరిత ప్రథమగణాధిప ఫణిభూషణనుతపరుగునరార॥ యిందు॥ పాపజిత్తుడననుచు నాపైని । కోపమెంచకను నీవుకోరికలొసగి బ్రోవు। దాసునియిటుల దోసిలొగ్గితే దయతోగావవ దయాంబుధినిధి॥ యిందు॥ మద్రిపూడిలో నెలకొన్న శ్రీరామునిదాసుడ । నైన నా యందు కరుణాయుంచి । బాలకవి బల్లా స్వామిదాసుని వరము లొసగి నీవు సరగున బ్రోవర॥ యిందు॥

శ్రీవినాయక ప్రభో నమో నమో.

విఘ్నవార్థు హారణకరుణ దేవబ్రోవరా । గౌరీనందనాయీశ నందనా ప్రభోనమోనమోనమో॥ శ్రీ॥ రాజితగిరీవాస విఘ్నవినాశ భూసురా॥ వేలావేలరా పాపహారణా ప్రభోనమో—॥ శ్రీ॥ నాగభూ

షణ నాగపేదిన వేగ బ్రోవరా దాసాపోషకా దైత్యహరణా ప్రభో నమో—॥ శ్రీ॥ సత్యనారాయణాఖ్యనాటక సంఘపాలక నీవే బ్రోవరా విఘ్ననాయకా ప్రభో నమోనమోనమో॥ శ్రీ॥

రాగము—కాంభోజి—ఆదితాళము

శ్రీరామచంద్రా నీ సేవా జేసెదనన్ను । చేపట్టిరక్షించరా రాఘవేంద్ర॥ లేమిచేతను కుచేలుడు నమ్మివేడగ । నెమ్మిలో సిరులివ్వవా॥ రా॥ బ్రహ్మరుషి భార్యయు బండ్రాయైబడియుండ భామానుగాజేయవా॥ రా॥ యెల్లదాసులవలెయుల్లమలరగనన్ను ఫల్లవధర బ్రోవరా॥ రా॥ పన్నగమగటూరి చెన్నకేశవమూర్తి నన్నశయనారారా॥ రా॥ పరగాకొంతెమువంశ వంగంగరాట్కవికి సిరులూవరములివ్వవా॥ రా॥

రామానీనామము వేమారువేడెద కామితార్థములివ్వవా రామయ్య॥ భూమిలో నీకంటె ప్రేమగల్గినవేల్పు స్వామి ఎవ్వరు లేరుగ రామయ్య॥ రా॥ కరిరాజు మకరిచే గాసిల్లివేడగా కనికరుసుగ బ్రోవవా రామయ్య॥ రా॥ పలుమారు ద్రౌపతిదలుపగ సభలోన వలువలొసంగలేదా రామయ్య॥ రా॥ అరమరలేకను ఆశించియుంటిని అరుదుగ నన్ను బ్రోవవా రామయ్య॥ రా॥ అలకుచేలుని గుప్పెడటుకులారగించి బలునైవ లక్ష్మినివ్వవా రామయ్య॥ రా॥ పొంగుచుదెచ్చిన యెంగిలిఫలములు మ్రింగి శబరిని బ్రోవవా రామయ్య॥ రా॥ రంగుగనీపాదరజము శిరమున దాల్తు రంగా మమ్ముల బ్రోవవా రామయ్య॥ రా॥ పరమాత్మ శ్రీపూలపల్లిగోపాలకశరణం టేమము బ్రోవరారామయ్య॥ రా॥ ధరణిలో బల్లా సీతారామా రాజుకు సిరులిచ్చి బ్రోవలేదారామయ॥ రా॥

రారయ్యజనులారా రామునిభజనకు రమ్మనిపిలచితె రాకుండుటిదితగదు॥ రార॥ కరములతో మంచి సిరితాళములుబూని కరిరాజవరదుని స్మరణ జేయుటకిపుడు॥ రార॥ కొంగులుజీరాడ చెంగులల్లాడగ శృంగములట్టుల చెంగుచెంగుననాడ॥ రార॥ దశరథతనయుడు శ్రీరామచంద్రుడు ధరణిలో పెనుగొండపురమున వెలసెను॥ రా॥

ఎంతశోకించినా యెవరుగానరారు చింతా బ్రతుకేలనమ్మ త్రిజట సాకత చిన్ననాటనుండి శ్రీరాముని డువక ప్రేమతో నుంటిని। భామరో యీసరికి॥ ఎం॥ ఆరుమాసములాయె ఆరాము విడనాడి చింతతో నుంటిని భామరో యీసరికి॥ ఎం॥ కైకవరమున మేము కారుటడవుల కేగి కష్టపడి యుంటిమి కాంతరో యీసరికి॥ ఎం॥ చింతేలనో యమ్మ శ్రీరాములల్లరిగో వారధి దాటొచ్చె వనితరో నిజముగ॥ ఎం॥

రాగము—యమునాకళ్యాణి—ఆదితాళము

వసుధలోపల సూర్యవంశమం దుదయించి వనములపాలైతిమి తమ్ముడ మనమీ వనములపాలైతిమి। వ॥ బిసరుహాక్షి సీత అసురునిచే జిక్కి పసచెడి పడియుండెనా తమ్ముడమారి పసనశించియుండెనా॥ వ॥ పొంకముగా వపరంజి జింకనుగాంచి యాపంకజముఖి పంపెరా తమ్ముడ నేనాజింకవెంటబోతిరా॥ వ॥ కైకవరముచేత కన్నతండ్రిటువలె కానన మున కంపెరా నాతమ్ముడ॥ కా॥ వ॥ పర్ణశాలయొద్ద భద్రమనిదెల్ప నా పడతినివిడచితివా తమ్ముడనీవా॥ వ॥ పరుల పొదరిండ్లు భూధరములు తిరుగ నాతరుణి గన్పించదయ్యె నాతమ్ముడ॥ తరు॥ వ॥ జానకినిప్పుడు గానక నడవిలో నేనెట్లుజీవింతురా నాతమ్ముడ॥ నేనె॥ వ॥ వద్దితౌతయ్యకు వరమడిన్నై నాదువనిత నెడబాసియుంటి నాతమ్ముడ॥ వనిత॥ వ॥

రాగము—కాంభోజి—ఆదితాళము

దశరథాసుతుడవై దశకంఠవధకొరకు ధారుణిజన్మించితివా॥ రా॥ విశ్వామిత్రునివలన విలువిద్యాలన్నియు వింతగానేర్చితివి॥ రా॥ తాటకాంతకుడవై తపసియాగముగాచి తరువాతమిథిలాకేగి॥ రా॥ శివకోదండము కేల చిటుకూనవిరచియు సీతానుగైకొంటివి॥ రా॥ జనకునానతిచేతవనమూల కేతెంచి ఘనకాకసురుగావవా॥ రా॥ నగరాజవాహన ఖరదూషణాదుల ఖండించితివిగదా॥ రా॥ మాయవేషముచేత మారీచువస్తుడూ మగువామను గొనిపోవవా॥ రా॥ వాయునందనుడల వాలివార్తయుజెప్పి వనచరేసునిబాపగా॥ రా॥ కపినాయకునుంచు సీతకోకాంతవై ఖరిదెల్పి కనక

భూషలు యివ్వగా॥ రా॥ పరమధర్మము చేత వరవాలిని బట్టి ఊర్ధ్వవారాధి గట్టించవా॥ రా॥ నీరాదనిభగాత్ర నిఖిలాలోకాధార నీరజదళ నేత్ర॥ రా॥ కమలాసంభవజనక కావుము నిరతాము కనకావసానధార॥ రా॥ హాసిగ మగటూరి వాసకేశవమూర్తి వందిబృందము నేలరా॥ రా॥ పరగా కౌంతయు వంశ పరంగా రాట్కవికి సిరులు వరము లివ్వవా॥ రా॥

రాగము—కాంభోజి—ఆదితాళము

లలితామృగమంతట లక్ష్మణయని వ్రాల-లలనసీతాలకించి॥ రా॥ ఆలక్ష్మణానీదు అన్నా విపినమందు ఆపదానొందు పొమ్మీ లక్ష్మణా॥ రా॥ అని జెప్పాలక్ష్మణుడు అంతట నినుగూర్చి చనుదెంచగా నిచ్చట॥ రా॥ ఘనుడు రావణుడొచ్చి వనితాసీతను బట్టి తనరథముపై నుంచుకూ॥ రా॥ జటాయువునుజంపి కుటిలచిత్తుడు తాను పుటభేదనము జేరాగా॥ రా॥ ఏది సీతని మీరు. రోదన మిడుచూచు శ్రీదేవి వెదుకాచనిరీ॥ రా॥ ధరణిలో మగటూరి ధామ జనపనినీ వర వెంకటాఖ్యునేలూ॥ రా॥

రాగము—శోకవరాళి—ఆదితాళము

భూపుత్రియేమాయెరా లక్ష్మణమూర్తి మీవదినె యేమాయె రా॥ భూపుత్రి విడనాడి నాకెదురువచ్చితివి। బొంకించి రావణుడు లంకా కెత్తుకపోయెనో॥ భూ॥ నట్టడవిలో సీత విడనాడ న్యాయమా। తమ్ముడవని చాలా నిను నమ్ముకుంటిని॥ భూ॥ బ్రతుకదురాయా సీత బ్రహ్మారణ్యము లోన। అడవియెండల జేతనడ లేమరా సీతా॥ భూ॥ వెన్నెల తేటైనయుద్బంగా రుకన్య యెన్నాళ్ళకై నాసీతను కండ్ల జూచెదను॥ భూ॥ మందయానతన డెందమూలో ఎంతగుందుచునుండు నేమో లక్ష్మణ॥ భూ॥ మృగముచే జచ్చెనో మోహనాంగి యిందు। అగుపడదాయెనుగదరా లక్ష్మణ॥ భూ॥

(సీత విలపించుట) రాగము—శోకవరాళి—ఆదితాళము

హా రామా హా రామా నుదుటన వ్రాసిన వ్రాలు మరచి నిదురబోతి వా॥ రా॥ అగ్నిసాక్షిగ నన్ను అంపించె మా తండ్రి అన్యాయమైపోతిని॥ రా॥ జనకునింటను నేను జానికినై పెరిగి వనమూలపాలైతిని॥ రా॥ వృథాముపద

లిన పక్షులరీతిని శిక్షలోబడియుంటినీ॥ రా॥ తడయక నాతల్లిదండ్రులు మీరని తలచుకుంటినీలాగు॥ రా॥ మామామాదశరథ మాయత్త కౌసల్య మన్నించుకుందురేమో॥ రా॥ నామరది లక్ష్మణ నామనోహర రామ నినుబాసి యుంటిగదా॥ రా॥

(సీత కలగనుట) రాగము—నవరోజు—ఆదితాళము

కలగంటినే చెలి గలగంటినే చెలి కౌసల్యనందనుడు రాగంటినే చెలి। వక్రశరముచేత చెలి వాలినిజంపి। వానరసైన్యం చేకొని వనజనేత్రుడు॥ కల॥ చిత్రకూటను నెక్కి యాచక్రధరుండు। విక్రమము గల్గిన నొకవీరునంపెనె॥కల॥ వానరవీరుండు వేగవారధిదాటి। వచ్చిచేరేలంక పురము వానరుడపుడు॥ కల॥ కండ్లదోను రాత్రియందు పంపుగాను। దండులిడిన మేడలన్ని తొదరిచూచెనే॥కల॥ వనమునందునన్నుగని వైకరినిదెల్ప వానరునిజూడక నేనొగచుచుండి॥ కల॥ యెవరువీవటంచు నేను వివరముగాను యింతిరో నేనడిగితి యావానరుడపుడు॥కల॥ అంజనీ సుతుండ నేనుఅమ్మరో వినవె అంజనేయునిబిలుతుర నేనుఅవనచరుండు॥క॥ విశ్వరూపముజూపుమన్న విక్రమంతుండు విశ్వరూపముజూపి నాతో వివరముదెల్పె॥కల॥ పురగళయునిపుంగరంబు హరిసుతుడిచ్చె కరములు ముకుళించి మొక్కె కాంతరో వేగ॥క॥అకలిచెనుంటిని నిరాకరించకలోకమాతసెలవొసగుడిలోపమెంచక॥క॥శత్రువా ర్తిబు క్తివలదుచెప్ప నేలను చిత్రకూటమునకువేగ చేరుమంటినే॥కల॥ వలదుతల్లి వొసగుడాజ్ఞ వక్షఫలమునకువారిజాక్షి వెనుకజూడనొందనెమనెనె॥క॥ పవనతనయఫలము వొకటిబక్షణజేసి పాలకడలిశయన చెంత చేరుమంటినే॥కల॥ వనమునకును కావలున్న ఘనదనుజొకని వాలముచేగొట్టిచంపెనపుడు। వాయుసుపుత్రుండుయపుడు వనమునంతయు వాలమధికముగను బెంచి వధయుచేసెనె॥క॥కొంతమందిరక్కసులుపంతముగాను కొంత జేరిరావణునికిజెప్పిరచ్చట॥క॥అధముడెవడొవచ్చియువధజేసెవనమును గదిసివానిపట్టిదెండిగద్య కిష్టుడు॥క॥ ఆజ్ఞచేసి కొంతమంది నసురులుబంపె కూరిసుతునిచె దునుము

బజేరి అసురస్త్రీకరము॥క॥ మేఘనాధుని చేతజిక్కి రాఘవబంటు అగ్రహాములో జేయుశిక్ష యంతయుజూచి॥క॥ వలువతో వాలమంత వ్రత్తియుజుట్టి వాలముచివరొన్ని జేర్చ లోలమవసుతైత॥క॥ వానరునివాలమంత వహ్ని జేర్చగా వైరముచే గదిసి పురమువీధులకరిగె॥క॥ అందమైనవరత్నములతో సొంపుగానున్న సుందరంపుమేడలన్ని జూచిగాల్చెను॥క॥ యీవిధముగ లంకయంతవధయు జేసెనె సుదతినన్ను సెలవుగోరె మతమగాత్రుడు॥క॥ వానరేంద్ర వడిగల వారధిదరిజేరి వాలమంత నీలనార్పి వారధిదాటె॥క॥ పోయిచేరి చిత్రకూటమునకు హెచ్చుగా పావశేయనశోడ దెల్పె పణతిక్షేమము॥క॥ వడిగల పర్వతములతో వారాధిగట్టి వారాధిదాటొచ్చి సారసాక్షినిగూడి॥క॥ లంకముట్టడించి గుంపుబింకముగాను శంఖలేక పంకజాక్షిసెలవొసంగెనె॥క॥ రాయభారము పెనొకని రవికులేసుడు రావణుడోడబడక పేనురాను పొమ్మనె॥క॥ సమరమునకు సెలవొసగుడి సామజవరద సందేహమేమిదెల్పుమనెను సైన్యాధిపతి॥క॥ రావణునితమ్ముడు శ్రీ రామభక్తుడు రమణిసీత నివ్వమనగ రావణుడినక॥క॥ తన కయిష్టమైనమాట తమ్ముడుబల్కె తన్నె నెదశకంధరుడు తనుఃఖలజూప॥క॥ శరణని విభీషణుడు కరములు మోడిచి ఉతగశయనుపాదములకు వరగి వగవగా॥క॥ కువలనేత్రుని సైన్యముచట ఘోరయుద్ధముకోలహాలముగ జేసిరచటగుంపుగూడియు॥క॥ భక్తుడైె విభీషణుని నాశక్తిశోడశు భక్తవర్య రావణుని శక్తి దెల్పెనె॥క॥ మర్మమంతవినియు వేగమారజనకుడు మహిమయుంచు శరణముబూని మాధవుడపుడు॥క॥ బాణచేరణమున రణశూరునిద్రుంచి గణసురేంద్ర వనుజునపుడు జనుమనిదెల్పి॥క॥ అసురనాధనుజాసీలంకకధిపతి జేసె శ్రీహరివారలున్నంతవరకు అభయమొసగెనె॥క॥ వన్నిగూడి అయోధ్యచేరె పన్నగేశుడు పన్నగ మగటూరి పురమున నున్న కేశవా॥క॥ సాక్షిగ గలగంటినే ఓసఖియరోవినవె సామజవరదుండు యిటకు సరగునొచ్చుట॥క॥ యురవుగ కొంతం వర నగకేశు నేలిన హరినుతు

డీ కలయింతరు శిరముదాల్చెనే॥ క॥

(రాముడు విలపించుట) శోకవరాళి—ఆదితాళము

ఏదెయ్యా లక్ష్మణ సీతా పర్ణశాలలో లేవెందుచేత యిది యేమోయీవింత మధురవాణియు లేదు। బెదరిపొదలలో మగుడాగినదేమో। ఏ॥ సఖియని సుఖమెల్ల జూడ సంపంగపూబోదినీడ కుమరా చంద్రునిబోలుఅర్ధరాత్రివేళ।పడతినడిచినత్రోవపండు వెన్నెలగాదు।ఏ॥ గుణశాలిమీవదిన గున్నమామిడిలాగు జనకునికూతురు జానకి సీత । యెంకుగానరాదు సీత దైవమీరీతి చేసెనుద్రాత॥ ఏ॥ వాసిగ జన్మంపుపేటలోనున్నట్టి మాపూరియిప్పన్న మదినిదలచుచుంటి॥ ఏ॥

జాంబవంతుడు ఆంజనేయుని లంకకు బంపుట

రాగము—కేగుప్తి—ఆదితాళము

సీతాజాడలుజూడుమా ఆంజనిలోకపూతాజాడలుజూడుమా।సీ॥ ఖ్యాతిగానీవేగి సీతాక్షేమముజూచి జేతాయునకుచేరి జాతినంతయు దెల్పు।సీ॥ మాయవేషములచే మరినిన్ను రాక్షసులు మనమునాటింతురు మరచివడబడకేగి॥ సీ॥ వానరోత్తమలంక వకనూరామడకలదు వారాదికుగోగనుమా వడిగాజనియునీవు॥ సీ॥ ఆలంకపురమంత అందమై యుండును అవిజూచిమరువాక హరిసతిని గైకొమ్ము॥సీ॥ ధరణిలోమగటూరి వరకేశావుసీచాలా నిరతాను నీమదిని మరిమరిదలచుచు॥ సీ॥ ఇనుపుగ కొంతము వరనరకేశుని నేలే హరి సతము మదినిల్పి సరసి జాక్షినిచూడు॥ సీత॥

ఆంజనేయులు వుంగర మిచ్చుట

రాగము—జాలికాంభోజి—ఆదితాళము

భోగిశయనవ్రేలి భూషణంబుయిది భూపుత్రి గైకొనుమా। సీతమ్మ హరిభంజనుడనేను అంజలిపుత్రుడను అమ్మానామనవివినవే॥ సీ॥ మాయామావేషములని మహిసుతమదియందు మారజనకుని వేడాగ॥సీత॥ విశ్వరూపముజూపయ్యింతియాసీతమ్మవీక్షించిబల్కెనపుడు॥సీ॥ భూమీ

జగ్గకొన్ని భూషణముతన సీత భోగిశయనుని దలచెనురా॥ సీ॥ ఆకలని దెల్పిన ఆవనచరునకు అభయమివ్వగనావేళ॥ సీ॥ వందానంబొసగియు వాయుసుపుత్రుండు వనమూన కేగుచును॥ సీ॥ ధరణిలో మగటూరి పురకేశవుడుమిమ్ము పరిపాలించుట కొచ్చేను॥ సీ॥ యిరవుగ కొంతెము వరనగధీశుని నన్ను నిరతము పోషించుమా॥ సీ॥

సీత రాఘవుల క్షేమము కనుగొనుట

రాగము—జాలికాంభోజి—ఆదితాళము

హరిసుతహన్మాంతకరిరాజవరదునితో మరిమరిదెల్పుమురా॥ ఆం॥ సారసదళనేత్ర స్వరజానసునితోను సంయోగమిటుగల్గెరా॥ ఆం॥ ఎచ్చోటనుండి మీరిచ్చాటికొచ్చిరి యిందుశేఖర ప్రియునితో॥ ఆం॥ అనిలనందన యిటు పనిబూనివచ్చితివి చనియీకథనుదెల్పుమా॥ ఆం॥ విషధరరిపుగమున ఇంద్రుండు క్షేమామ ఇప్పుడునాతో దెల్పుమా॥ ఆం॥ సుగుణానంతుండైన సుమిత్రానందనుడు సుఖసీనుడైయుండెనా॥ ఆం॥ ధరణిలో మగటూరి వరకేశవుడు మమ్ము పరిపాలించుటకేగెకో॥ ఆం॥ ఇరవుగ కొంతెము వరనగధీశునేలే హరితనయా జను వేగమే॥ ఆం॥

రాగము—రేగుప్తి—ఆదితాళము

హన్మంత నీవేగజనుమా నాదుమనవీగా రాముతోననుమా। మునుపు నేనెవ్వారిపతులబాపితొగాని పనిబూని బ్రహ్మను కగుభావముగాజేసె॥ హ॥ హింసాలుపాలైతి ననుమా సూర్యవంశాజుబంటువె చెపుమా। కౌసల్యసౌమిత్రి కైకా మాయత్తాల వంశామందరికిని వందానమనిదెల్పు॥ హ॥ రాములక్ష్మణులరమ్మనుమా వారిక్షేమాములడగితిననుమా। రాముడునామాట ప్రేమాతోదలచూనా స్వామిపాదార్చనా జేయనోచనైతి॥ హ॥ నిదురహారములు లేవానుమా సీత మదిచాల దుఃఖించెననుమా। ఎదురుగా శ్రీరాము డెప్పుడొచ్చునోయాని పదపాడియుంటి యాపదమాన్పి రక్షించు॥ హ॥ నావాక్కునన్నింతజేసె నావయీవిధి పరమేశ్వరాసె। రావణాకుంభకర్ణాదులా ద్రుంచాను

భానిజజనకుని పయువానామెరమ్మరుమిూ॥ హా॥ జలనిధీ వేగచెంగ్నానమూ దాటి జలజానాభునిని సరగుననూ। అలమాడ కనకయ్యా కేలవిబ్రోచిన గాని కుఱుమూరురామయుడు సిరులిచ్చి రక్షించు॥ హా॥

ఆంజనేయులు సీతక్షేమము దెల్పుట

రాగము—కన్నడ—ఆదితాళము

ఏమనిదెల్పుదూ సామజవరద। యింతిసిగనుగొంటెని॥ రాఘవేంద్ర॥ వక్కాలఘుపునను వారాధిదాటియు వనజనేత్ర వేగమే॥ రా॥ లంకాద్వారముచున్న లంకిణిజంపియు కింకరులనుకునిమితి॥ రా॥ కెంపులమచ్చిన సొంపయినమేడలను జూచితిసూక్ష్మమున॥ రా॥ అందూలగానక అశోకవనమూలో ఆజానకినిజూచితి॥ రా॥ పద్మాక్షునీచుట్టు పదివేలరాక్షసులు పారాల్ గాచియుండిరి॥ రా॥ రాజావదనచుట్టుచున్న రాక్షసస్త్రీలు రంగూగాపురికరుగాగ॥ రా॥ కామ్యాధునికినే సీతమ్మవద్దనుజేరి క్షేమామంతయుదెల్పితి॥ రా॥ రామూనీముద్రిక రమణీమణికిచ్చిఅమ్మా సెలవిమ్మంటిని॥ రా॥ నీరాజనిభగాత్ర నీవుండగ భయమేమి నిర్భయముగ వచ్చితి॥ రా॥ పరగ కొంతియువంశ వరకొండ్రాట్కవిని నను నిరతము పోషించుమూ॥ రా॥

రాగము—కాంభోజి—ఆదితాళము

రామూనీనామను వేమూరువేడెద కామితార్థము లివ్వరా॥ రామయ్యా॥ భూమిలోనీకన్నా ప్రేమగల్గినవేల్పు సామీయెవ్వరు లేరురా॥ రా॥ పలుమారుద్రౌపతి దలుపాగసభలోన వలువలొసంగలేదా। అలకుచేలుని గుప్పెడటుకూలారగించి భలువయినా లచ్చినివవా॥ రా॥ పొంగుచుదెచ్చిన యెంగిలిఫలమూలు మ్రింగిశబరిని బ్రోవవా॥ రా॥ కరిరాజుమకరిచె గాసిలివేడగా కరినీమనుచుగబ్రోవవా॥ రా॥ రంగూగ నీపాద రజను శిరమునదాల్చు రంగమయ్యిబ్రోవరాదా॥ రా॥ పరమాత్మ శ్రీపూలపల్లి గోపాలకా శరణంటె మమ్ముబ్రోవవా॥ రా॥ ధరణిలో బళ్ళా సీతారామరాజుకి సిరులిచ్చి కృపజూడరా॥ రా॥

## రావణునికి సీతకి సంవాదము

నాతోనీవాయపనికమాటిమగనైన్రిశను శీలావలచేస్తవే॥ఓసీత॥ పాపాత్మ్నుయీవంటి పలుగాకిమాటలు పలుకనో రెబులాడా॥ రావణ॥ పలుగురాక్షసునిపడిమించగనేల పదవేనగానగిరంగోకి॥ఓసీత॥ నగ గూనపోగమూని నాథునిబాణముచే నణగిపోదువు ఛీపోరా॥ రావణ॥ రాముడుభీముడు రణశూరుడైనను మారణములోబడిచావడా॥సీ॥ మా సినియిక పెక్కుమాటలపనియేమి మర్యాదవెలిసిరవమ్మ॥ఓసీత॥ మర్యా దవెలిసిన మగడురాముడు నిన్నుమట్టిపాలు జేసురా॥ రావణ॥ గరుడాయ షురకిన్నర కామినులకన్న గరితా యెక్కువదానవా॥ఓసీత॥ యెక్కువ తక్కువ యెంచుట నీకిది వీలుగాదు ఛీపోరా॥ రా॥ వదరాకు నీవంటి వనితాలు మావద్ద పదివేలుబడియుండిరే॥ఓసీత॥ పదివేలవనితలు బడి యున్నా యీకన్నవనితాపై యాశలేరా॥ రావణ॥ గమనీనీనాథుడు రాముడెవ్వరికన్న రణశూరుడో చెప్పుమా॥ఓసీత॥ పుడమిలో కోసారి భోగాలింగాకవి పోషాంకుడని యెరుగవా॥ ఓరావణ॥

## అంగద రాయభారము

వలదూరాదశకంఠ వాలిహరునిపైని వైరాముఖిశనృపు॥ రా॥ రావణ॥ అంగదబహుమాటలాడవద్దిచ్చోటఅతివేగమేబొమ్ము రా॥ అంగద॥ మనుజాధ్ముగాడురా మాధవుడురాముడు వనితనిచ్చియుబ్రతుకరా॥ రా॥ వనజసంభవులీటు వచ్చినప్పటికయిన వనితాను విడువానురా॥ అం॥ రామావిభుడుసీతో రాజికిబంపేరకోమలినిచ్చిబంపుమా॥ రావ॥ రాజిపడను వాని నాజిజంపియుప్పేట్ల ఆజానకితోనుందురా॥ అం॥ వోరిదుర్మార్గనీ నోరెట్లుబలికెరా సీతూరిబల్కిన కొట్టెద॥ రావ॥ యింద్రాదిసురులెల్ల యిటుదూరుననుజూచి యింకానీపల్లెమోరా॥ అం॥ ధరనూ జనవనీని వరవేంకటాఖ్యుని శిరులిచ్చే దొరగొల్వుమురా॥ రావ॥

కష్టుబసంహారించినదేవరా కీతిఙాయామొకీగెలు మేరువాయె చెట్టుపైని చెట్టుగపలుక చుట్టుకున్నవి చిగురువిడచి తాకినాంతరి। తఝెఘెఝంతరి మేఘమండల మనెమందిర మీదసాలవిశాలమాయెర।అరితతాకిఘణము లెల్లను - విదియచంద్రుడు - పిందెలాయెర- పిందికాయె-నాటినాటికి- బండుపండెర - పండుకీతిని - నిండుపున్నపు వెన్నెలాయెర - రామయ్యాదీరారారా - అతిరికాంతరి తాకుఝుణుతక - రవికులాంబుధి సోమ - దశరాథరామచంద్రా - నాటినేటికి నిన్నెనమ్మితి - నటనకాశీ నాధవినుత - శ్రీచెలగు తంజాపురిని వెలసిన భళిరపక నృపాలతనయా శాభాసురే సలాము రే।

## మత్స్యావతారము

తకిట - ఝుణుత - ధిమిత - తకుంధరితక - మనమగాత్రుడయినసోమకాసుర - వదిమిషట్టితివార-నాల్గువేదములుధాతకిచ్చితివి- నమ్మితిరారా - వేగస్థిరముగమగటూరి పురమున వెలసిన-పురగశయన వచ్చిబ్రోవగదరా - తకిట్తఝుణుత - ధిమిత - తకిట్తఝుణుతక ధధిగినతక - ధిమికిటతక దధిగిణ ధరనుకొంత వంశోద్భవుడగు నగధీశుని కృపచె నేలుమురా మత్స్యావతారా। చల్ మత్స్యావతారా॥

## కూర్మావతారము

తకిట్తఝుణుత - ధిమిత తకిట్తఝుణుతక సురులనుబ్రోచిన హరి సుతప్రియుడై - మరిమరీదలతును - మదియందున నే- మరిప్రహ్లాదుని హరియనివేడగ - మహిమచేత - మాధవబ్రోచితివా అరయగ మగటూరి - పురమున నెలకొన్న పరమదయాకర - పాపవిమోచన-ధరను కొంత వంశోద్భవుడగు వరనగధీశునినేలు। సాంలాంజ॥

రామనినునమ్మి ఝుణౌకిణ సారసాక్షవిసాలవిక్రమ - నీరజేశ నిన్నునమ్మితి-కన్నగాశయ లెన్నోవిధముల గిన్నణశాయకనుమమ్ముల- కరుణనేలుము శామజనక - తకిట్తఝుణుతకధిమితతక కరిరాజవరదారార -దర్శనమివ్వవేర - ధరణిలో మగటూరి పురమున స్థిరముగా

సన్నుట్టి కేశవకరుణతో మము బ్రోవగా సదె తరుణమిది కాంతవంశ శరధి జాడగు శైలరాట్కవి కిరవుగను శిరులొసగుచుండెడి పరమపురుషారా॥

రాగము—కన్నడ—ఆదితాళము

వందనమిదిగో నందబాలకా మందరధరవేగ॥ కృ॥ పూజజేతు మురపుష్పములతో నీను భూరిపరాక్రముడ॥ కృ॥ మారజనక నా నేర మేరా మన్నించితినిన్ను॥ కృ॥ భక్తవర్యయాశక్తితోడను ముక్తియొసగ జేయు॥ కృ॥ అండజవాహన అఖిలదనుజాల్లను చండాడితివౌరా॥ కృ॥ కన్నుగ మగటూరి చెన్నకేశవ కన్నడశాయుకరా॥ కృ॥ ధరను కాంత వంశోద్భవుడగు వరనగధీసుని నేలు॥ కృ॥

సరస్వతి ప్రార్థన

అకుగు—రాగము—మధ్యమావతి—ఆదితాళము

రావమ్మ పల్లవపాణి నీవు కమలాసునిరాణి రావమ్మ పల్లవపాణి నీవు॥ వరకరుణారస సురుచిరహృదయే సురమునిసన్నుత చరణయుగళె శ్రీ॥ రావ॥ తల్లీ నానాలుకాయందునునిల్చి తాండవమాడుచును నీవు సరగున గావవమ్మా-ధవళసుభాస్వర దేహివిలాసే నిటలఘటితమృగమద తిలకాంతితే॥ రావ॥ ముందుగ నిన్ను దలతుతల్లీ లోకపావని నన్నుదయ జూచిరక్షించవే-ప్రకటదురితతతి భేదవినోదిని కవులపోషణి కలువరాణి శ్రీ॥ రావ॥ లోకమాతవనుచూను నిన్ను లోకులెల్లరు మహాభక్తితో పూజించేరు-సరిగమపదనిస సరిగమపాయని వీణమీటుచును నాట్యము లాడుచు॥ రావ॥ వీణచేబూని వేగమెదేవి ఆడుచు పాడుచును యులికూల వేణినీవె గిణత తకిట తక ధిమితాయని సప్తతాళములు సరగున మీటుచు॥ రావ॥ ధరణి మద్దిపూడి పురమందు వెలసిన శ్రీరాముని మది యందున దలచుచూను-బాలకవి బల్లాస్వామిదాసుని వరములొసగి నీవు సరగున బ్రోవను॥ రావ॥

అమగు—రాగము—ముఖారి—ఆటతాళము

మదినెరనమ్మితి భారతీ నిను-మదినెరనమ్మితి భారతీ॥ మదినెర నమ్మి గతినీవెయని-సతతముదలచితి హితమతిగావవె మది॥ నిఖిలదేశ

ములనెల్లవిద్యలకు-దాపునీవే దేవిమహాజనని॥ మది॥ కమలాక్షునిసతి గవదవళ్లాక్రుతి-కావవెనన్ను కరుణతోడుతను॥ మది॥ రక్షితము నిజన రాజపురాణాణ రామలింగపరిపాలననినే॥ మది॥

రామప్రార్థన

రాగము—మధ్యమావతి—ఆదితాళము

రామానన్నుబ్రోవరదేవ మర్రిపూడి నివాసానిన్ను నేనెరనమ్మితిరా॥ కరుణింమామని శరణంటినిర యీతగిననీవునా మొరాలకించి॥ రా॥ భక్తవరదనిన్ను యేవేళ శ్రీరామరామయనుచు భజనచేయుచునుంటి-ముక్తికోరకు నాశక్తికొలదినే వేడుకొంటిని వేదవేద్య శ్రీ॥ రా॥ యింత పరాకేలరానీకు నే నిరతము రామరామయనుచూ బిలచుచునుండ-పరాకుమాని బిరానజని నా తాపహరాన్ప్రా తారకనామ॥ రా॥ దిక్కునీవేయనూచు వేడు మొక్కుకొందుకు-యెందుకిటులకుయఖపెట్టెదవు-నిన్నే మంటిని నీలవర్ణుడా నిన్నేగాదా నిరతమునమ్మితి॥ రామా॥ శౌరినామ ననుజంతుడీర్చి కుందారకార-వేగచేపట్టిరక్షించార బ్రహ్మాన్వామి దాస పోషకార దయతోగావర దశరథనందన॥ రా॥ ధరణి మర్రిపూడి పురమందు మద్గాణవారివంశజుండైన సరయుక్తగట్టించినకోవెలలోనకోర్కెతో వెలసిన శ్రీరామాగను శ్రీను మెబ్రోవర॥ రామా॥

భజనదార్లకు హెచ్చరిక

రాగము—మధ్యమావతి—ఆదితాళము

భజనసేతాము రాండోయన్న-శ్రీరాములవారి భజనసేతాము రాండోయన్న॥ దాసులబ్రోచెడి ధాముడైన శ్రీ-రామునిమనము మరిమరిబొగడుచు॥ భజ॥ అందాముగ గౌతమికేతెంచి అందరముగూడి జనులుమెచ్చాగ స్నానముజేసి-రాముని భజనకు రాదేయపుచునుఒకరికొకరు కేకలిడుచును॥ భజ॥ పట్టుపీతాంబరములధరియించి చెంగూలలాండ చెంగు చెంగూన నెగడుచూను-తిరుమణితిరుచూర్ణంబు నుదుటను తీరుగదిద్దియు స్థిరమతితోనుతి॥ భజ॥ అన్నలార విస్తారందమూను కుడు

లుసవరించి వ్రేలుముళ్ళను తరుసతో ముడిచి-చిరతలు చేతను చెలిమి తోబూనియు-పొంగుచు రాముని పొందుగదలచుచు॥ భజ॥ పొన్న చెట్లు చుట్టూరనిలచి - శ్రీ గోవిందాయని రామకీర్తనలు పాడుచూను కాళ్ళను గజ్జెలు ఘల్ ఘల్ మ్రోయగ శ్రీరామాయని చిందులు ద్రొక్కుచు॥ భజ॥ ధరణీమర్రిపూడి పురమందు వెలసిన-శ్రీహరి నేపుడుపురువకుండగను - మనము బాలుకువర బల్లాస్వామిదాసుని-నరగునబ్రోచిన శ్రీగోవిందుని॥ భజ॥ ధరణిపెద్దాపుర వాసుడైన-దుర్గా సరయ్య-కోర్కెతో గట్టించిన కోవెలలో - పొందుగ వెలసిన సుందరి రాముని-మరిమరిదలచుచు మనమందరము॥ భజ॥

రాగము—నాదనామక్రియ—ఆదితాళము

రండీజనులార రాముని భజన సేయుదాము॥రం॥మత్స్యరూపుడై సోమకుద్రుంచిన - మత్స్యవతారుని భజియించుదాము॥ రం॥ సురలు కొరకు మందరగిరిమోచిన కూర్మావతారుని భజించుదాము॥రం॥దురాత్ముడగు హిరణ్యాక్షుని ద్రుంచిన వరహావతారుని భజించుదాము॥ రం॥ హిరణ్యకశిపు నురముజించిన నరహరిమూర్తిని భజించుదాము॥ రండీ॥ అదితిసుతుడైన బలిని గెలచిన వామనమూర్తిని భజించుదాము॥ రం॥ ధరలో క్షత్రియులను దండించిన-పరశురాముని భజించుదాము॥ రం॥ దశకంఠుడను దండిగద్రుంచిన దశరథరాముని భజించుదాము॥ రం॥ ఇలలో యదుకులమం దుదయించిన-బలరాముని భజించుదాము॥ రం॥ దుష్టకంసునిన్ ద్రుంచినట్టి శ్రీకృష్ణమూర్తిని భజించుదాము॥ రం॥ కలియుగాంత్యమున గలిగెడుదైవము కలికిమూర్తిని భజించుదాము॥ రం॥ ధరణియందున మర్రిపూడిలో దుర్గా సరయ్య గట్టించినా॥ రండీ॥ ఆలయంబున అతులితంబుగగను వెలసిన రాముని భజించుదాము॥ రం॥

రాగము—మధ్యమావతి—ఆదితాళము

యొంతబిలచిన రాకేమయ్యా-శ్రీరాముని భజనకు యెంతబిల

చిన రాకేమయ్యా-యెంతపిలచిన యింటిలోనుండి యివతలకు రాకేమి సేతును॥ యెం॥ నేనెంతబోధించిన వినకున్నారు జనులారవీరు వృథా చెడిపోయెదరు సుమండీ శౌరినిదలువక చంకినస్తలూను-కింకరులపాలై చెడిపోవరు॥ యెం॥ రాముమహిమవీరెరుగకున్నారు యితనకుమించిన ప్రభువిలాను వెదకినగాన రాడు-కోరినవారికి కోరికలొసగుచు దాసుల పాలిటదైవంబౌతను॥ యెం॥ భజనాసీతారామరన్మసిపిలువదొంగయొత్తేసి యేదో ఒక యుగ్మత గలదందూరు - పరభామలకై సంపులుగొందులు పొందగవెదకుచు పరుగులిడుదురు॥ యెం॥ వాసిగామద్రిపూడిలోన కడు వేష్కతోడ దుర్గా సరయ్య గట్టించిన కోవెలలోన-కొర్కెతో వెలసిన రామునిమహిమ తెలియజెప్పచును॥ యెం॥ మున్నుకరినిగాచినయట్టి కరివరదుండాని మాటిమాటికి జెప్పచూను-వాసిమీరగా జల్లాస్వామి దాసపోషకుని భజనకురమ్మని॥ యెం॥

రాగము——ముఖారి——ఆదితాళము

హరినీదాసుడనయ్యా నా మొరవిని యిటురావయ్యా-హరినీ దాసుడనని వేడిన కనికరముజూపవు కరుణాజలధి॥ హరి॥ ముదముతో మీపాదములనునామది పాదుకొల్పినను బాధమాన్పవు హరి కరిమొర విని తొందరగాజని కరిపడుగాచిని శ్రీనారాయణ॥ హరి॥ తరముగాని వేదనబొందుచు సంసకరణజిక్కి వేసారుచుంటిని॥ హరి॥ తపయుకజేసి యమగులిసమ్మతి వృషుతభక్తికి కడుమెచ్చినహరి॥ హ॥ అలచిత్రిభద్రా చలపతియనగా-ఖలుని నిట్టుప్రకాసునిబ్రోచిన॥ హరి॥

రాగము——నాదనామక్రియ——ఆదితాళము

భజరే శ్రీరామం హేమనస భజరే రఘురాం-భజరే రామంభండన భీమం-రజనిచరాసు విరామం రామం॥ భ॥ వనరుహనయనం కనదహి శయనం మనసిజకోటి సమానం రామం॥ భ॥ తారకనామం దశరథ రామం శ్రీతులసీదళ శ్రీకరధామం॥ భజ॥ శ్యామలగాత్రం సత్య చరిత్రం-మద్రిపూడిరామ దాసపాలనం॥ భజ॥

మధ్యమావతి రాగము — ఆదితాళము

కళ్యాణముజూతాము రారమ్మ శ్రీరాముల పెండ్లట-నూచి సేవించి వత్తమురండీ॥ కల్యా॥ ఎంతోదూరము లేనేలేదట-యిక్కడకే వచ్చెం డాయడున్నదట॥ కల్యా॥ దశరథసుతుడట రఘుకులతిలకుడట-కోరినవారికి కోర్కెలొసగునట॥ కల్యా॥ అవిలక్ష్మీకటట అనుకూలంబట స్వామి శ్రీరాముల సరసనుండెనట॥ కల్యా॥ కొండపాముగు పందిళ్లువేసిరట ధరణి తోసము పెళ్లరుగు వేసిరట॥ కల్యా॥ మంచిముత్యాల తోరణాలు గట్టిరట తమలపాకులె దప్పుగట్టిరట॥ కల్యా॥ పందిరికొమ్మున పసిడిగుండలట పందిరిలోపలా గ్లాసు ట్లైటులట॥ కల్యా॥ గుళ్ళ సంభమట గుబ్బగోడుగు అట బేరిమృదంగలు మ్రోగుచుండెనట॥ కల్యా॥ వీధివీధులా వీరభోగమట సందుసందులా సానిభోగమట॥ కల్యా॥ పెళ్ళికొడుకు శ్రీరాములవారట పెళ్ళికూతురే సీతాదేవట॥ కల్యా॥ మిథిలాపురములో పెళ్ళిఆయెనట బాగుమీరగ బాసికాలుగట్టిరట॥ కల్యా॥ కాలుద్రొక్కి కంకణము గట్టిరట లాలితముగ తలంబ్రాలుబోసిరట॥ కల్యా॥ తెల్లవారి సారెల్ల బెట్టరట మోచుగుమ్మా దంబాలిగట్టిరట॥ కల్యా॥ అంబారిలో అయో రాములట కొలువైనారట కోర్కెలుదీరగ॥ కల్యా॥ పొందుగామశ్రీ ధుర్రి పూజింగా గుర్గా సరయ్యు గట్టించి॥ కల్యా॥ ఆలయంబునా అతులి తంబుగ దశరథరాములు వెలసినారయట॥ కల్యా॥

శోకవరాళి రాగం — ఆటతాళము

భూపుత్రియేమాయెరా లక్ష్మణమూర్తి మానవదెనయెటు బోయె॥ భూ॥ భూపుత్రివిడనాడి నా కెదురువచ్చితివి బొంకించిరావణుడు లంకకెత్తుకపోయె॥ భూపు॥ నట్టడవిలో సీతనూ విడనాడనీకు న్యాయమే నాతమ్ముడా-తమ్ముడవని చాల నినునమ్మినందుకు చక్కాగ జేసితివి చక్కారబొమ్మాను॥ భూ॥ బ్రతుకనేరదురాసీతా బ్రహ్మారణ్యంబులోపలా అడవియందలచేత నడలేనురాసీతా-వెన్నెలకు తేటైన వెలదిబంగరు కన్య॥ భూపు॥ మొన్నాళ్ళకై నాసీతనూ-నా-కన్నులజూచెదనా మంద.

యీన తన డెందములో యెంతగుందుచుండెనో నాముద్దుతమ్ముడా! భూ॥ ధరణిలో మర్రిపూడి పురమందువున్న చక్కనిశ్రీలక్ష్మి బాలకవి బల్లాస్వామిదాసుని కరుణతో గాచిన కమలగాత్రి శ్రీ॥ భూపు॥

## సీతకోసమై రాముడు దుఃఖించుట

### చుట్టుకీర్తన—ఫీల్వారాగము—ఆటతాళము

పోయితే హాసీతా పోయితే నీవూ-పోయితే పూబంతి పోయితే నెలతా॥పో॥ ననువంటిగావిడచి నలినాక్షీనీవూ జనగాను ధర్మమ సత్వ సంశీలా॥పోయి॥హామృగమధ్యమ నినువిడచినేనూ యేతెరంగుననుందు ఎట్లోర్చుకుందూ॥ పోయి॥ విరచితి హరువిల్లు వెలదీని కొరకూ-పరశు రాముని ప్రజ్ఞ భంగకరచితిని॥ పోయి॥ నీకుగాయీ రెండు నిందేలుజగతీ నలినాక్షీ ప్రాప్తించె నినునమ్మియుంటే॥ పోయి॥ యిడుములాకోర్చి నా వెంటనేవచ్చి-ఏమయితివో నీవు దెలియాలేనైతీ॥ పోయి॥ పయిడిమృగం బాని బ్రమసినీవడుగగా నీకోర్కెదీర్తునని నేనుబోయితిని॥పోయి॥బోయి నిన్నునేను గోల్పోతిచెలియా ఏమిచేయుదునాకు ఎవ్వారుదిక్కు॥ పో॥ నినుబాసి ఇఁకా ప్రాణ మెట్లునిల్పుదునూ భామరో నీవులేని రాజ్యమే లానకా॥ పోయి॥ శ్రీలక్ష్మీకరమైన మర్రిపూడిలోనా ధరణి దుర్గా సరయ్య గట్టించినట్టి॥ పోయి॥ ఆలయాధిపుడు మన జోడుబాపినుగా-బల్లాస్వామిదాస పోషణీనీవూ॥ పోయి॥

### మధ్యమావతి రాగము—ఆదితాళము

బాలకృష్ణుడువచ్చెనపుడు లీలతముగ శ్రీ బాలకృష్ణుడువచ్చె నపుడు బాలచంద్రసమపాల్య భక్తపరి-పాల గోపికా లోలుడైన॥ బా॥ మీనావతారమెత్తినాడే దేవాదిదేవుడైనదేవాకినందానుడే మానుగ సోమకు మేచుజంపిచతురాననుకిచ్చిన సూనశ్రుతులు శ్రీ॥ బా॥ కూర్మావ తారమెత్తినాడే దేవావందితుడు ధర్మజాదూల బ్రోచినాడే-నిర్మలమతి నైమె కూర్మితో నుదరము-నిర్మిలిపీపున పేర్మివహించిన॥ బాలా॥ సార్గా సాక్షాత్తు నేను శౌరి-దశరూపధరుడు-ధారుణీజనుల బ్రోచువాడు కోరికతో మర్రిపూడి పురంబుచు-సారెకునేలిన కారుణీకాగ్రణి॥ బా॥

చుట్టుకీర్తన—తోడిరాగము—ఆదితాళము

దైవమా నేనేమిసేయుదు తమ్ములిలపైగూలిరి భావించిన-బరికించగాను భ్రాంతికరమగుచున్నదో॥ దైవ॥ సతతముచు భువి ధర్మతనయుని చాటునిలసినబాలలు-వింతగామదిదోచుచున్నది ఎవరినైనమో చూడగా॥ దైవ॥ సీటికొరకైవచ్చిభువిని సీటుగాపడిపోయిరి కారణంబేమని వసింపను-కారణంబె తెలియధూ॥ దైవ॥ యెప్పుడీవృథనుల్-ప్రళయమెరుగని సోదరుల్-యిప్పుడీ పాటుమాయకాలను లిక్వగించదలంచెనో॥ దైవ॥ కొండిమంజులగారిగోప-బాలునిసాక్షిగా దండిగా ఈయెడవి భూముల నుండవలెనోదీక్షగా॥ దైవ॥

అనుగుకీర్తన—మధ్యమావతిరాగము—ఆదితాళము

ఏమాంటిరానిను శ్రీకృష్ణా ననుగావవిదేర కృష్ణా నేను నీదాసుడయ్యా॥ కృష్ణానీదాసుడ ననివేడిన కనికరముంచవా కరుణాజలధి॥ ఏమా॥ ముదముతో మీపాదములనునేనుమదినిల్పి స్మరణజేయుచుంటినిగాని దేవ-యెన్నడైననిను చిన్నమెత్తుమా టన్నవాడను గానుర స్వామి॥ ఏమా॥ నీచెల్లెలగు పాంచాలి నినువేడ-వలువలిచ్చిన గాచిన కృష్ణానను గావరవేగ-కరిమొరవిని బిరబిరబిరగాజని మకరినిద్రుంచిన శ్రీగోపాలా॥ ఏమా॥ మాటిమాటికి కృష్ణాయనుచు-నినునమ్మినేను సేవజేయుచునుంటి దేవ-ప్రహ్లాదుడంవారి మురహరియనుచును మొరలిడవానిని బ్రోచితి దేవ॥ ఏమా॥ బీదవిప్రుడు దెచ్చినట్టి యటుకుల దినియు వానిదయతో సిరులిచ్చినదేవ-కపటబిత్తు కాకాసురు దునిమిన కృపగలవాడవని-కోరివేడితిని॥ ఏమా॥ ననుబ్రోవసమయాము నీకిదేరా - శ్రీమద్రిపురినివాసకృష్ణా నాపైకోపమేల - బాలకవి బల్లా స్వామిదాసుని చేపట్టిరక్షించరా దేవా॥ ఏమా॥

యమునాకళ్యాణిరాగము—ఆదితాళము

శ్రీరామచంద్రప్రభో ననునీ కరుణ నేలుకోరా-పరమపురుషమో వెంపులేకనీ మహుకుజొచ్చితిని ఆదరనేయుకు॥ శ్రీరా॥ పిలువగా

రామచంద్ర నాధారమంతాతము నీదేనుహస్త్ర-భక్తుల బ్రోచేటి దొర
వనినినునే నెరనమ్మితిర జానకిపోషకా॥ రామా॥ యెంతానే వేడుకొందు
నయ్యా శ్రీమదజనక నాపైకాసింతో నెవరుంచావు-కరిప్రహ్లాదుల గాచితి
వనినే-ఆసంతో వేడితిసుందరిరామా॥ రామా॥ యేమిరెయింతానేవేడినగాని
నీ మోమింకజూపవు రామా నేజేసిన పాపంబేమి-బీదవిప్రునిదయతో
గాచిన దీనదయాకర ధీరునిబ్రోవరా॥ రా॥ పంతామేలనునాపై నీకింత
దంతీరక్షాక - ధరనూ మద్రిపూడి పురములోన - దుర్గా రాజు
గట్టించిన కోవెలలోనా వెలసిన శ్రీహరి॥ రామా॥ యెంతాకఠినమా
చిత్తమోనీది కాసింతయైన కరుణాకరయుంటి వేడురరామ-వాసిగబల్లా
స్వామిదాసుని-సంపదలొసగి సరగున బ్రోవర॥ రామా॥

నాటరాగము—ఆదితాళము

రామానిన్నునే నమ్మినానుగదరా-ఓకరుణారస శ్రీరామానిన్ను
నే నమ్మినానుగదరా॥ దశరథనందన దశముఖమర్దన దశావతార దయ
తో బ్రోవర॥ రామా॥ యెంతానిన్నునే వేడుకొందునయ్యా-శ్రీదంతివర
దనే నేమిసేయుదు తాలుజాలనురా సురపతిసన్నుత సుగుణాగుణార్థ-
సుతలను బ్రోచిన సుందరాంగ॥ శ్రీ॥ రామా॥ నన్నుబ్రోచే దొరవు
నీవేయనుచూ-నరనాథనిన్నునే నిక్కముగాను నమ్మియుంటినిగదరా
నిగమవేద్యాప నిత్యకల్యాణ నిరుపమాకార నీలవర్ణ శ్రీ॥ రామా॥ పదా
లానుసేనమ్మితేదుగదరా-భద్రాచలవాసనే భక్తితోనిసూ భజింపుచుం
టినిగదరా-పతితపావన పాపవిమోచన పన్నగశయన పద్మనయన శ్రీ॥
రామా॥ యెంతావేడినాతావుయీదేలరా-ప్రహ్లాదరక్షకా యేమిానేర
మూనేను జేసితిరా - వారధిబంధన వరకరుణారస - వందనీయ వన
వాసరాఘవ॥ రామా॥ దిక్కునీవేయనుచు నేనెప్పుడునూ శ్రీసీతా
పతినీ - పాదములనూ నమ్మియుంటిగదరా పావనమూర్తి పట్టాభి
రామ - పరుగునవచ్చి పన్నుగబ్రోవర॥ రామా॥ పొందూగాను
శ్రీమద్రిపూడిలోనున్న శ్రీరామచంద్రనను - నిరూలిచ్చివేగముగ దయ
తోను-బాలకవిబల్లాస్వామియాఖ్య-భక్తుని బ్రోవర బాలగోవింద॥ రా॥

కీర్తన

నిన్నే నమ్మియున్నానురా నన్ను కరుణతో జూడర॥ తండ్రీ నీవని ధాత్రిలోన నమ్మితి-కన్నతండ్రి నీవను కన్నులజూడర॥ నిన్నే॥ యితరములు నే నెరుగనురా నాగతి నీ వనుకున్నానురా-పతితపావనుడ పరమదయా భుడ-అతులితముగ నన్నాదరించర॥ ని॥ దాసులకును నే దాసునిరా-నే దోసిలొగ్గియున్నానురా-భాసురముగ నిల రామదాసుని-దాసపోషకా విశేషచరితా॥ నిన్నే॥

వరాళి రాగము—ఆదితాళము

యెన్నడుజూచెదనో హరిని-యెప్పుడుజూచెదనో॥ యె॥ యెన్నడు జూచెద పన్నగశయనుని-వున్నడు లేడా పన్నగరక్షకుడు॥ యె॥ సరిగమ పదనిస సరిగమపా యని - సరియని బర్హశరములు బాడుచు॥ యె॥ ధింతకుతోం హతో ధింతాయనుచును-ధింధిం మ్రోగుచు సందడిచేయుచు॥ యె॥ తకిణకుర్ఝాంతరి తాకుంధాతాని - తధైత వైశబ్ధములాడుచు॥ యె॥ పొంగుచు నలజర్ల గంగయదాసుని పొంగుబంగారము కొన్నాడను చును॥ యెన్న॥

ముఖారి రాగం—ఆటతాళము

ఏమిరసీతారమణా-నన్నేలవేమి కృపభరణ॥ సతతముసీతాపతి నీవేయని-మదినమ్మితిని పతితపావన॥ ఏమి॥ ఎంతవేడినగాని సుంతైన దయరాదేర-యేమిపాపము యేమితెలియదు-యేమిసేయుదు యేమి నివేడుదు॥ ఏమి॥ కోపమేలనాపైని నేకోరివేడుచుంటినిరా-పంతమేల పక్షీంద్రవాహన - పంతముశాయుకు పరమదయాకర॥ ఏమి॥ చిన్న ప్రాయముచేనే - నెన్నిపాపములుజేస్తా అన్నిబాపనీ - వున్నవాడవని నిన్నునమ్మితినినన్నుగావర॥ఏమి॥ బాలునిశ్రీరఘురామా-బహుభంగు లవేడినబ్రోవా-భక్తులబ్రోచేటి భక్తవరదనిను-బాగుగనమ్మితి భాను వంశహరి॥ ఏమి॥ బాలుడనైనందుకునా-నాభారమంతనీదనుకు భాసు రముగనిను - భజింపుచుంటిని భక్తునిబ్రోవర భద్రాద్రిపతి॥ ఏమి॥

వేమారు వేడినవాడ నన్ను జెరువకుమీ యనరాదా-భక్తితో రాక్షస బాలుడు వేడగ భయముబాపివాని బ్రోవలేదాహరీ॥ ఏమి॥ నామీదను నీదయ్యరాద-రామ నామునవిపినికావ తల్లిదండ్రి నా-కిలలోనీవని యెల్లప్పుడున న్నేలుమంటెని॥ ఏమి॥ పాహిరామప్రభోయనుచు నే పలుమారు వేడినగాని-కరుగునవచ్చి పాపముబాపవు - పాండవరక్షక యంత మేలరా॥ఏమి॥ ధరలో మర్రిపూడినగరవాస శ్రీరామా-వాసిగ బల్లా స్వామి దాసుని సంపదలొసగి సరగున బ్రోవర॥ ఏమి॥

ముఖారి రాగము—ఆటతాళము

సీతాపతి శ్రీరామా నీకెంత జాలిలేదూరా - రామబ్రోవమని రమ్మటంచునే-రంగుగబిలచిన రావుయిదేలర॥ సీ॥ ఎంతనే వేడుకొందూ మీకిసేయుదునునేనూ - వెయ్యివిధములా వేడుచుండినా విన్నబడనివాని వలె వూరకుంటివి॥ సీ॥ బాలుడేగదాయనుచు బ్రోవకుంటివాదేవా - బాలప్రాయమునె బహువిధములనిను - బ్రస్తుతించమని బ్రహ్మప్రాసెను॥ సీ॥ శరణన్నవానిగాచే శరణాగతబిరుదేమాయె - శరణంటినిరా శ్యామలగాత్ర - శైలవాసనుత శరదీబంధన॥ సీ॥ నామొరాలకించిటు రావు నాదుష్కర్మమేమొ తెలియదురా - నరహరినీవని నమ్మి భజించిన - నాదిక్కుజూడవు నారాయణహరి॥ సీ॥ యేమిర శ్రీరఘురామా యెన్నడుబ్రోతువు త్రిధామా - యెన్నివిధంబుల వేడినపలుకవు - యేమియదృష్టమొయెఱుగరాదమది॥ సీ॥ కోర్కెలొసగెదావనుచు కోరిభజించినగాని-కఠినచిత్తకాసింతమైననీ - మనసుకరుగదుమందరగిరిధర॥ సీ॥ శ్రీలక్ష్మీకరమైనట్టి శ్రీమర్రిపూడినగరమున - వేంచేసిన శ్రీ చెన్నుడగావర - బల్లా స్వామి కవివరుపాలన॥ సీతా॥

కీర్తన

కఠినమాయెనీ మనాసుగా రామాకరుగదేమందురా - కోరిబిలచిన కోరికలొసగవు-నీలవర్ణ నిన్నే మనిదూరుదు॥ కఠి॥ ఈవులమగజాలానురా-మీపాదసేవ పదివేలురా-భావజనక మీ భావముదెలియ-నీవె

దైవమని నిన్నెనమ్మితిర॥ కరి॥ నిన్నెనమ్మియున్నానురా - నేనితరుల నమ్మగలేనురా - యేలువాడవని చాలగనమ్మితి - యేలరజాలము యేలుము శ్రీహరి॥ కరి॥ నీకేదయరాకున్ననూ నేనేమిసేయువాడానురా - పాండవపోషణ పరమాత్మహరి - నీకంటె యిక్కు నాకిలలోనెవరురా॥ కరి॥ నీనామమునే నెప్పుడునూ - నేమరువక భజింపుచుంటిరా - హరనుత గోవింద హరి ప్రోవరసను - రాజితవైభవ రాజలలామ॥ కరి॥ శరణాని జనమూలను - ప్రోచెదిరుదుసిదిరాములు - పరిపరివిధముల మొఱలిడ ప్రోవక-వూరకుండుటిది వుచితమ శ్రీహరి॥ కరి॥ వాసిగాను మద్రిపూడిలో వాసధామ శ్రీరాములు - బాలశివి బల్లా స్వామిదాసుని-ప్రోచిన రంగ భోగిశయనహరి॥ కరి॥

ముఖారి రాగము—అటతాళము

రామచంద్రదేవా నన్ను ప్రోవవేగరావా - రామచంద్రయని రంగుగబిలచితి-స్వామినన్ను ప్రోవకున్నవేమి॥ రామ॥ హరిహరియని నిను మరిమరివేడిన - కరుణించరనను కమలవిలోచన॥ రామ॥ పరమపురుషయే-తెరవుజూపకను అరమరజేయుట-తగదూరనగధర॥ రామ॥ ధరణిలోమద్రిపూడిపురంబును-సారెకుసలిన కారుణికాగ్రణి॥ రామ॥

మాయామాళవిగౌళ రాగము—ఆదితాళము

పంతమేలరా శ్రీకాంతజనకనాతో-పంతమేలనే నెంతవాడరా-చింతదీర్చినీ చెంతజేర్చుమి॥పం॥ కోపమేలరా శ్రీగోపాలస్వామినాపై కోపమేల గోపాలబాలా - ఆపదదీర్చుమి పాపహరణశ్రీ॥పంత॥ బీదవాడనా బాధమాన్పర-మోదముతో నన్నాదరించరా॥పం॥ రక్షించవేమిరా శ్రీపక్షివాహన - రక్షించవేమిహరి పక్షివాహన - కక్షయేలను భిక్షుకుండను॥ పం॥ ఆసించియుంటినీ మోపముశాయకు-ఆసించియుంటిని మోసముశాయకు - వాసుదేవనీ దాసదాసుడను॥ పంత॥ స్థిరముగసద్గురువు శ్రీయడ్లరామాయాఖ్యుని-కరుణచేతనీ మరుగుడూరితిని॥ పం॥ వాసిగరేచర్లపేట నివాసుడ - దాసుడుమామిడి అప్పలదాసుని-మోసముశాయకు వాసుదేవహరి॥ పంత॥

## మధ్యమావతి రాగము—ఆదితాళము

నందివాహనుడై వెడలెనపుడు హరుడుయుద్ధముకు-నందివాహనుడై వెడలెనపుడు॥ నందినెక్కి యానందముతో బాలేందుధరుడు గోవిందునిమీదను॥నం॥ జడలలోగంగపొంగుచుండ-ధావళ్యమైనయొడల భస్మము మెరయుచుండ - బడిబడితన వెంబడిప్రమథులుకదు - వడివడినడువగ చిడిముడిపాటున॥ నం॥ వాలాయమసురేంద్రు బ్రోచుటకు వేములవాసుడౌ శౌరితోబోరుటకు- కేలనుభయదా భీలంబగునిజ శూలము ద్రిప్పుచు నీలకంధరుడు॥ నంది॥

## యమునాకల్యాణి రాగము—ఆదితాళము

వాదా శ్రీరామా నాపైదయలేదా రామా॥ మోదముననుఆదరింతువని-పాదారవింద మాదారమునుంటిని॥వాదా॥ వేడితినిరవ్విగా నామొనట నేరామెన్నకుమీ- వేడుకలలర నీ సేవజేసెదను వోడిమిగా నీదు జాడజూపుమయ్యా॥ వాదా॥ పసిబాలుడానంటి నినుచాలా బ్రతిమాలుచుంటి - హేళనసేయక నేలుకోమంటిని-జాలమేలను నీలవర్ణ నీకు॥ వాదా॥ ధరణిలోనుమద్రి పూడిపురమందున్న నీరజాక్షునా నేరమెంచకుమి-మేరగాదు శ్రీనరహరిమూర్తి॥ వాదా॥

## కీర్తన

మహారామచంద్రులవంటి మాప్రభువున్నాడాభువిలో-శ్రీరామచంద్రులవంటి శిరివరులున్నారా హరిలోరంగ॥ దూరముధరముదురవయ్యోరామ-ధీరసుభారము చూచితిరావలె॥ మహా॥ కైకమాటలకు కాకపడకహరి కీల్వ్యాకుండై కానన కేగిన॥మహా॥ వాలినికోలను కూలద్రోసిహరి - కొట్టిసుగ్రీవుని అట్టిబ్రోచిన॥ మహా॥ రాతినినాతిగ భూతలమందున - ప్రీతిగజేసి ప్రఖ్యాతిగాంచిన॥మహా॥ తాటకివచ్చేటిదారిగనుంగొని-వాటముగ బడద్రోసిననరహరి॥ మహా॥ తనకానిక్రిష్ణయ్య దాసునిబ్రోచియు - పొంగుచుభద్రాచల మేలేటిహరి॥ మహా॥

నాట రాగము—ఆదితాళము

హరానిన్ను నేనమ్మినానుగదరా - ఓకరుణాకరపుర(శ్రీ)హర నిన్ను నేనమ్మినానుగదరా॥ వరాలతండ్రివి మొరాలకించర నిరాదరణ సేయకుమీకరుణా॥ హ॥ నిజంబుగనిను భజింపుచుంటిని - గజాసురాంత గ్రహించి ప్రోవవు॥ హ॥ నిరతము పెద్దా పురమిశ్వేశ్వర - నేరానమ్మితిని మొరాలకించర॥హ॥ దాసునిటుల దోసిలొగ్గితే ప్రకాసినీహృదయ జేసిన పల్కవు॥ హ॥

కీర్తన

రామాదైవశిఖామణి నన్నేలరనన్నేలరా-రామాదైవశిఖామణి॥ కాముకేళికివను కలియామనే కామాంధుడు॥ రామా॥ కల్లుకనిమత్స్య భువి వల్లభునిభార్యనను మెల్లగన్నుకీచాకుని-మేడకును బంపించెను॥రా॥ తరుణియగు సుధేష్ణకు-తమ్ముడటపాపాత్ముడుదూ రామణినాదీజడ-బట్టి ఈడ్చసాగెనయ్యో॥ రా॥ జెప్పితి నాభర్తలు గొప్పవారున్నారని - చెప్పినమాటచెవి జేర్చడాయె దుష్టాత్ముడు॥ రా॥ ధరణికురి పేదిరెడ్డి వరముల్రిచ్చిప్రోవవేళ-యిదేసమయామురామ వేగనన్నుబ్రోచుటకురా॥

కీర్తన

నాథావినునరహరితో వాదాయూలుచాలించుము-ఆదిమధ్యాంతరమున కాథారుడై(శ్రీ)ధరుడు॥ నాథా॥ శ్రమనూలకు శామాలయు-చెప్పిననువినకావాడు శ్రమజెందియు శంభునీభూమినలగించెగని॥ నా॥ వాలీ(శ్రీ)రాములతో వైరములుందెల్పవేళ-నీలవేణితారాజెప్పి సీతవిడచి నీగ్రైవాణ॥ నాథా॥ నక్షత్రములకుహాడు నంటిపెరిగేటివాడు - కద్దాచి సీతానునీకిచ్చి జీల్చెదనుగాని॥ నాథా॥ పసుపుకుంకమునిల్ప వశమదీశ ముప్పాటర వసుడగు మత్స సుబ్బరాయూనే నేలేదను॥ నాథా॥

కీర్తన

వీరంజనేయు వీరంజనేయు-వీరానీసాటెవరు లేరంజనేయు॥ వా రాధిలంఘించిఒక్కగంతులోన-కోరిదుమికితివయ్యఆపురంజనేయు॥వీర॥

లంకలోజొచ్చి నిశంక చేతున్నట్టి - లంకిణీ జంపినా శౌరంజనేయ॥ వీరం॥ తల్లిసీతానుజూచి వుల్లాసమునలంక - వెళ్ళగించీతివయ్యా అవు రంజనేయ॥ వీరం॥ లంకావార్తయుజెప్పి పాతాళకునిబట్టి - శ్రీరాము చేతచిక్కించజేసితివి॥ వీరం॥ ధరణిలో మల్లువారి పురమున వెలసిన - దొరవారిపాలన్న అవురంజనేయ॥ వీరం॥

చుట్టుకీర్తన—నీలాంబ్రరాగము—ఆటతాళము

అన్నా ప్రేమకుమార అన్నాబంగారా - నానోముబలకారి నా సుకుమార॥అన్నా॥ నెలలుతొమ్మిదిమోసి నినుగంటికొడుకా- బలము లేదయ్యా నాబ్రతుకేలనయ్యా॥అన్నా॥కన్నయ్యనానోము నసపూరిసేవు- పొన్నఎవ్వరికిద్దు ఈపాలచేవు॥ అన్నా॥ కొడుకినిన్నెవ్వరు గోల్పచ్చి నటరా - గోల్పచ్చినవారు చెడిపోకపోరు॥ అన్నా॥ ధరరాగీతుంతాళ్ళ పురమూన వెలయు - సరసీజయుడుకూల సరమూలచరిత॥ అన్నా॥

అడుగుకీర్తన—శోకవరాళిరాగం—ఆటతాళము

వోరినీవెవ్వాడవురా బారెవ్వారుజూతునురా చోరువో యాధి కారుడవోలేక-చోరుడ ఈదారి రారాదుపోరాదు॥వోరి॥ మాటలుమీర కురా నీతీటణగించేనురా-కోటానపేటాన సాటెవ్వరుతేరు-దీటముగా నొకవేటూ కేబడవేతు॥వోరి॥ నీకులగోత్రాపేరేమిరా నీ తలిదండ్రులెవ్వా రురా కంజాతబంటుని కార్యార్ధమైవస్తి-కిలకిలనవ్వుచు వచ్చెపుచచ్చెవు॥ వోరి॥ రామలక్ష్మణులకొరకై నేను తలతెక్షణమువస్తినిరా-ఇలలోనబల ములుగలవాడవనినీవు-రామూలసత్తూన రత్నారవేళల॥ వోరి॥ మాత్స్య వల్లాభునీరా పైకొచ్చేనిడిగోచూడరా-కుక్షినీబింధువ కుంబినీరాగల- మత్స్యముప్రమింగగ మరిజన్మమెత్తితి॥వోరి॥ మాకుగన్న తండ్రివినారా ఈలంకామర్మాము దెల్పరా-గాతాకుడానసికూతాలుగూష్టిని-పాతాళ ఈలంక జాడాలుదెల్పరా॥ వోరి॥ ముదామొుప్ప వరపురమురా శ్రీరా మునికరుణించరా-వరముచే సుబ్బయ్య వరమతయ్యనాడు శ్రీరాజు చంద్రూల సేవాకుడరారా॥ వోరి॥

(బాణాసురుడు అనిరుద్ధుని నాగపాశబద్ధునిం
గావించినప్పుడు ఉషాకన్య దుఃఖించుట)

చుట్టుకీర్తన—సీల్వా రాగము—ఆటతాళము

హా మన్మథాకార హా సుకుమార - హా మేరుసమధీర హా రణశూర॥ హా ను॥ హా సుందరాకార యబ్ధిగంభీర - హా సుగుణోదార హా యదు వీర॥ హా ను॥ కటకటా మాతండ్రి కఠినాత్ముడగుచు - కటుతరయహిపాశ బంధసంతతుల - బంధురకోపసంభరితాత్ముడనగుచు బంధించె నేనిన్ను పసిబాలుడనక॥ హా ను॥ నీదుగాంభీర్యంబు నీదు ధైర్యంబు నీదు ఔదార్యంబు నీదు శౌర్యంబు॥ హా॥ నీ శాంతి నీ దాంతి నీ తనుకాంతి - నీదు చేయు తఃకృతి నీదు యాకృతియు॥ హా ను॥ నీ చిన్నె నీ వన్నె నీ సొంపు పెంపు - నీ చక్కదనము నే నెంచుబోతు॥ హా॥ యెత్తివవలపుచే నే కౌగలింప గుత్తంపు తాదైరగుబ్బపోటులకు॥ హా॥ నోర్వలేనట్టి నీ యురము పై మునాటి- దుర్వారశరములు దూరిపోవంగ॥ హా॥ యెటు నివగచితివో యెటు సహించితివో- వేమరు తుపశతి వేళలయందు॥ హా॥ లాలించి మద్భుజా లతల బాధింప - వాలాయము మగుడు వశరీరంబు॥ హా ను॥ బంధురతర నాగ పాశబంధముల - బంధింపగా నెంత పరితపించితివో॥ హా॥ మోహనకార నీ ముఖవిలాసంబు - రాహు మ్రింగిన యట్టి రాజబింబంబు - గతియున్న దక్కటా కళలెల్ల దరిగి - వితతకారుణ్యా యో వీరాగ్రగణ్యా॥ హా ను॥ తల్లి దండ్రుల బాపి తరుణుల బాపి - యల్ల బాంధవులను యెడబాపి నన్ను॥ హా॥ తెప్పించి బాణుని తీవ్ర బాణముల - కొప్పించె నిదియని యురుకోపము నను॥ హా ను॥ చూడవో నా దిక్కు మృదులోల్కు మాట - లాడవో నాతోడ యాత్మేశ నీవు॥ హా ను॥ నిండేశ్వరుని గల్గి నిన్నిట్లు విధియు - బంధ నంబున నొంట బడ నూనివ్రాసె॥ హా॥ యేమందు నాకింక నెవ్వారు దిక్కు - యీ మందిరం బేల యీ భోగమేల॥ హా॥ యీ తల్లిదండ్రులు యీ బంధు జనులు - యీ తరుణీమణులు యీ వైభవంబు॥ హా॥ యేటికి నా చెంత నీవు లేకున్న - పాటింప నా పుణ్యఫలమిట్టులయ్యె॥ హా॥ నా పాలి దైవంబు

నానోముపంట - నాపెన్నిదానంబా నాపట్టుగొమ్మ॥హా॥ధరణి శ్రీ మర్రి పూడి రామసత్కరుణ - లేశంబుమనమీద లేదా యెశయఘ్యో॥హా॥

సుద్దహిందోళ—ఆదితాళము

ఖగవాహన కరుణజూడరా॥ దిక్కునీవెరా దీనరక్షకా॥ ఖగ॥ దయనుబ్రోవరా దానవాంతకా - దంతిరక్షకా ధామ శ్రీరామా॥ ఖగ॥ కక్షయేలరా బిక్షకునిపై-కక్షవిడువుమీ కామజనక శ్రీ॥ ఖగ॥ దాసుడ నంటీ దయజూడమంటీ - దశముఖవధా దశావతారా॥ ఖగ॥ యెంత వేడినా సుంతైనగాని - దయనుజూడవూ ధర్మమూనీకు॥ఖగ॥ బాలూ డననీ గేలిసేయకా - చేపట్టినన్నూ చయ్యాన బ్రోవూ॥ ఖగ॥ కోపమే లరా కోరివేడితీ - మెరవుమాన్వరా వేదవేద్య శ్రీ॥ఖగ॥ వాసికామర్రి పూడివరమునా వాస శ్రీరామా వాదమేలరా॥ ఖగ॥ సరసిలో బల్లా స్వామిదాసుని - సరగునబ్రోవు స్వామి శ్రీరామా॥ ఖగ॥

అడుగుకీర్తన—మధ్యమావతి—ఆటతాళము

యేమిసేయుదుదైవరాయ - యెటుదోచదాయె మాయ-రావ ణుడే యగుపడడాయె॥ యేమిసేయుదును రామలక్ష్మణులు - యేమి సేతనో యెుచటనులేరిక॥ ఏమి॥ నీలవేణిరో నీవెవ్వారవు-నీలాటికేవున చాల ఖేదంబుజెందియున్నావు - బాలామణినీ బాధదెల్పుమిక యేలా దుఃఖము ఎరుకజెల్పుమిక॥ ఏమి॥ రామలక్ష్మణుల మైరావణుడు - నీ మముతో కాళికినిలసి బలియివ్వబూనున్నాడు - ప్రేమమీర శ్రీ రామ లక్ష్మణుల - సామాన్యంబుగ చంపదలచెనిక॥ ఏమి॥ జనని నామనవి వినవెకొమ్మ-ఆతనయుల నేనుమాడక బ్రతికించెదనోయమ్మ- అలివేణినీ యాభాండముపై ఘనముగ వ్రాలెద కడకుజేర్చుమిక॥ ఏమి॥ ముప్పవర పురముగరిసేలు భద్రమహాంకాళికిమాయ - రావణునిబలియొసగ్గి - వొప్పగకాళికి మెప్పుజేతునిక - నగరిజేర్పుమ నలినాతాక్షిరో॥ ఏమి॥

చుట్టుకీర్తన—ఫీల్వారాగము—ఆటతాళము

అయ్యోవానరులారా అన్యాయమాయె-యీవేళ శ్రీరాము

లేకుండబోయె॥ అయ్యో॥ వాలానుతో కోట హాళాయము జేసితినీ నీలాంగుళ్ల సేను నిద్రాబుచ్చితినీ॥ అయ్యో॥ సుగ్రీవంగదనీల సుషేణ గవయు - ఆంగీవాంజనేయ భూవిభీషణ॥ అయ్యో॥ అందాఱకిప్పుడే మందబుద్ధాయె - ఎంతుజూచిన రాము డగుపడడాయె॥ అ॥ యేమి సేయుదునిప్పుడు యెటుదోచదాయె-ఇలలోన శూరుల ఇవ్వడే గాల్చెడను॥ అయ్యో॥ ఇట్టివానరులంత చుట్టియుండగను - నట్టనడుమనుయున్న నా రాముడు లేడు॥ అయ్యో॥ పాతాళలంకకు ప్రభుడైనవాడు సీతెడచే వాడు నిత్యాలకదరి॥ అయ్యో॥ రామలక్ష్మణులను హేమానివాడు-తా దీసుకెళ్ళిన తనప్రజ్ఞజూపె॥ అయ్యో॥ ధరమొప్పవరపుర వాసుడైనట్టి వరముచే సుబ్బయ్య వగడుండుయేడి॥ అయ్యో॥

సీత లంకలో రామునికొఱకై దుఃఖించుట

చుట్టుకీర్తన—శీల్యా రాగము—అటతాళము

హా రామ హా రామ హా రామచంద్రా - హా రఘుకులసోమ హా కౌశల్యపుత్ర॥ హా రా॥ హా మన్మథాకార హా రణశూర-సోమునిబోలు నీ సుందరాననము॥ హా రా॥ తామరలందమౌ దనరు నేత్రములు-క్రీమించు బొమలును చెన్నొందుబొమలు॥ హా రా॥ దాడిమబీజ సౌందర్యము తోడ - యీడుబాయకనొప్పు యీపలువరుస॥ హా రా॥ తిలకమొ మించి తీరైనగతిని-లలితనాసికంబు దెలువగుపాలమీ॥ హా రా॥ శశీ కండమనియెడి చెక్కులగుల్కు - మిసిమెరాడుమీముని మీసంబు లకట॥ హా రా॥ యమృతరసములొల్కు మీ యధరంబు శ్రీల - నగవన వీనుల బవిరిగడ్డంబు॥ హా॥ నళమించు కైనాను కందదేమియునూ జలజాక్ష నీకిట్టి రావుకల్గునానీ॥ హా॥ చెలియలేనైతినే తేజోభిరామ-చలమూన యీనీచు జంపూదువనుచు॥ హా॥ కొదువకననుత్రోసుకొనిపోదువనుచు మదినమ్మియుంటినే మనుజలోకేశ॥ హా రా॥ కఠిన యీ దైత్య సంఘములోన నన్ను-యటుడించుబడరాని యిడుమలుబడుచు॥ హా॥ నుండు మంచునన్ను తొంటినెంచి హంసలాభిపజన్మ మర్యాదగుణ॥ హా॥ ఇది

యేమిరవిబాసి ఇంపైనబాయ తవలునా ఈరాము వల్లభయేను॥హా॥ గౌ
నొకమూపుత్రి గాశకోయాని - కానుస్థతిలకుము యెడబాయునకట॥హా॥
ఇనతేజచేమూశ దీకునాయకరాయుటిలత్తకై కేయి-కోర్కెలుదీరె॥ హా॥
ఘటియించ నేమందు కటకటాయకట - యేటుసేతు తెరగు నాకె
య్యాదియకటా॥హా॥ మటుమాయవైతివె మానవాధీశ - హారఘుకుల
చంద్ర హాసుగుణసాంద్ర॥ హా॥ వాటముగ మిత్రిపుత్రాడి-వరద శ్రీరాము
డెట్వాయుదికెన్క నెవరిపేమునును॥హా॥ బల్లా స్వామి దాశపోషా రఘు
వీరా-హా రాజదేవేంద్ర హారాజచంద్రా॥ హా॥

(శ్రీరామలక్ష్మణులు నాగపాశబద్ధులయినప్పుడు సీత దుఃఖించుట)

ఫీల్వా రాగము—అటతాళము

హానాథ హానాథ హామహాశూరా - హాసుందరాకార హాను
దారా॥ హా॥ హావీరశేఖర హాకృపాపూర్ణ-హావార్ధిగంభీర హా
మేరుధీర॥హా॥లోకరక్షణకళాలోలుడైనట్టి-నీకిట్టిదుర్గతి నేడేలగలిగె॥హా॥
హరివిల్లువిరచితి వత్యుగ్రుడైనా-పరమాషణాదుల ఖండిస్తివకటా॥హా॥
దురములోపల నీకు ఎదురునిల్వగనూ - హరిహరాదుల కైన నల
వియేమారా॥ హా॥ వసుసనగస్త్య విశ్వామిత్రపుణ్యా - వరతపోధనులచె
నడసియున్నట్టి॥హా॥ పరమపావనములాలు బ్రహ్మాస్త్రముఖరి శరములాలు
శత్రుపై సంధించగాను॥ హా॥ మరచితేహానాథ మానూలకోను-భుజం
గములపాన్పు యొప్పనీకనుచు॥ హా॥ వినియుంటియోసర్ప వితతియేక
డకూ - నినుగట్ట త్రాళ్ళాయెనే నేమియకటా॥హా॥ లాక్షిణీకులునన్ను
లాక్షించిచూచి సర్వలక్షణాన్వితవు వల్లభునిగూడి॥ హా॥ చెలువొంద
పట్టాభిషిక్తవై సుతులా - గన్నియువతిగ నుండెదవనిరి॥ హా॥ వారల
మాటలునకటాబొంకయ్యె-మనుజేశనాపుణ్యమహిమయెట్టిదియో॥హా॥
యేమిసేయుదునింక యెయ్యాది తెరవు - భూమిశ నీవుసుబోయిన
సతికి॥ హా॥ నీవెంటనై నానునేవచ్చెదాన - గావునసేమీరు గావగదే
వా॥ హా॥ యెన్నాడు తమనాలుగ్నేళ్ళాలునిల్పడు-యెన్నడవు దెంతుకొ

